Registered No. M 4345.

# యుద్ధ సం




వాల్యుం II.] మద్రాసు : 1942 వ సం॥ జనవరి నెల 9 వ తేదీ శుక్రవారం [నెం 1 రు

## రష్యాను ఎలుగుబంటి : జపాను కొంగ.

బ్రహ్మచారి ముదిరినా బెండకాయ ముదిరినా ఎందుకూ పనికిరావంటారు. హిట్లరుకు ఇంతవరకూ పెళ్లిగాని, పేరంటంగాని ఏమీలేదు. ముండి శిఖండి బ్రహ్మచారిగా వున్నాడు. బ్రహ్మచారి అంటే నూరు కోతులతో సమానం. నూరు కోతులకు వున్నంత తలతిక్క యీ హిట్లరు బ్రహ్మచారికి వుంది. సంసారికి ఉండే కష్టసుఖానుభవం, ముందు వెనుకలు ఆలోచించి ధర్మం దాక్షిణ్యం గమనించి సరసంగా ప్రవర్తించడం అటువంటి మనిషికి సహజంగా వుండదు ఎన్ని తెలివితేటలు ఉన్నా, ఆ లక్షణాలూ ఆ సుగుణాలూ మాత్రం ఆ బ్రహ్మచారి కోతికి లేవు. అందుకనే యిటువంటి యుద్ధాలపిచ్చలోపడి కిందమీదు తెలియక వీరావేశంతో లోకాన్ని విరుచుకొని తింటున్నాడు. యుద్ధాలలో గెలుస్తూ ఉన్నంతసేపు హిట్లరు తన సేనాధిపతులను నమ్ముతూ ఉంటాడు. రష్యా యుద్ధం ప్రారంభించి ఆరు నెలలు పైన అయింది. నవమాసాలు దాటినప్పటికీ, కడుపులో కోరిక ఫలించేటట్లుగా లేదు. అసలు యీ రష్యాతో హిట్లరు యుద్ధం ప్రారంభించినప్పుడు మూడు నాలుగు మాసాలలో రష్యాను జయించగలనననే అహంకారంతో, అతిశయంతో, తలతిక్క ప్రతిజ్ఞతో బయలుదేరాడు. కాని అక్కడ యీ తిక్కశంకరయ్యగారి పప్పు ఉడకలేదు. తన మూడోకన్ను తెరిస్తేనే చాలు, లోకాలన్నీ భస్మమయిపోతాయనేటంత గర్వంతో, అహంకారంతో ఉంటున్నాడు. ఇంతవరకూ చేసిన యుద్ధాలలో తన ఆటసాగినట్లుగానే, రష్యాలోకూడా నిరాఘాటంగా సాగుతుంది అనుకున్నాడు. ఆరు నెలలు రష్యాతో యుద్ధం చేస్తే అనేక లక్షల జర్మను సేన నాశనమైనదేగాని, ఆ యుద్ధానికి అంతు కన్పించడంలేదు. తనకు అలవికాని పనిలో దిగాడు. శక్తికి మించిన బరువు తలమీద యెత్తుకున్నాడు. ఇంకా ఆ యుద్ధం దేవదానవ యుద్ధంలాగున, రామరావణ యుద్ధంలాగున సాగుతూనేవుంది. రష్యాతో ముందువెనుకలు చూడకుండా యుద్ధానికి దిగడం తన జీవితంలో తలపెట్టిన బ్రహ్మాండమైన సంకల్పం అని యీ హిట్లరే మొన్న నీ మధ్య ఒక ఉపన్యాసంలో అన్నాడు. అతని సేనాధిపతులకు యీ రష్యా యుద్ధంతో ప్రాణాలు విసిగిపోయినాయి. తల ప్రాణం తోకకువచ్చింది.

రష్యాలో హిట్లరు ప్రతాపం అస్తమించేకాలంవచ్చింది. రష్యా దేశంలో తెల్లని ఎలుగుబంట్లు వుంటాయి. ఆ తెల్లని ఎలుగుబంట్లకు ఆ దేశం ప్రసిద్ధి. అవి అక్కడ మంచు గడ్డలలో స్వేచ్ఛగా తిరిగే మొండి జీవాలు. రష్యా దేశం పేరు చెప్పితే ఆ ఎలుగుబంటి తప్పకుండా జ్ఞాపకం వస్తుంది. రష్యాను ఎలుగుబంటి అనేది చాలా జగత్ప్రసిద్ధమైనది. రష్యాదేశంకూడా చాలా బ్రహ్మాండమైనది. శత్రువులకు చాలా అసాధ్యమైనది. అందుకనే రష్యాను ఎలుగుబంటితో పోరాటం ఎటువంటిదో, రష్యా రాజ్యంతో పోరాటంకూడా అటువంటిదే. ఇటీవల చాలా సంవత్సరాలనుంచీ రష్యా కూడా ఆయుధ సామగ్రి వగైరాలు ఎక్కువగా తయారు చేసింది. అంగబలం, అర్థబలం, ఆయుధబలం బాగా పుష్కలంగావున్న బ్రహ్మాండమైన రష్యా రాజ్యం శత్రువును పీల్చి పిప్పిచేయకుండా విడిచిపెట్టుతుందా? రష్యాయొక్క పట్టుదలకూడా ఎలుగుబంటి పట్టుకొన్నట్లుగా, భల్లూకపు పట్టుగా వుంది

పూర్వమొక పర్యాయం యిద్దరు వర్తకులు ఒక నదీ ప్రవాహం దగ్గరకువెళ్లి, ఆ నదిలో కొట్టుకొనివస్తున్న పెద్ద పెద్ద లేకుమానులు చూచారు. ఆ వరదలలో అడవిలో వుండే పెద్ద వృక్షాలూ, చుట్టుపక్క గ్రామాలలోనుంచి వరదలవల్ల కొట్టుకొనివచ్చే సామానులూ, అనేకం కన్పించాయి. ఈ ఏటిలో అడ్డంగా యీదుకొనివెళ్లి ఆ వస్తువులన్నీ ఒడ్డుకు తెచ్చుకోవలెనని ఆ యిద్దరు వర్తకులకు ఆశ కలిగింది. ఒకడు ఒడ్డున కూర్చున్నాడు రెండోవాడు ఏటిలో యీదుకొనివెళ్లి, సామానులు తెచ్చి, ఒడ్డున ఉన్నవానికి అందిస్తున్నాడు. ఏటిలో దిగినవానికి నల్లని కంబళీమూటలాగున ఆ ప్రవాహంలో ఒకటి కన్పించింది. ఏదో పెద్దమూట కొట్టుకొని వస్తోంది అనే ఆశతో వెంటనే గట్టిగా ఆ మూటను కావిలించుకున్నాడు. ఒడ్డున ఉన్నవాడుకూడా ఆ మూట విప్పి చూడాలనే ఆశతో ఆతురతపడుతున్నాడు. "ఆ మూట త్వరగా ఒడ్డుకు తీసికొనిరారా!" అని కేకలు వేస్తున్నాడు. ఏటిలో ఉన్నవాడు ఒడ్డుకు యీదుకొనిరాలేక నీటిలోనే అవస్థపడుతున్నాడు. అంతబరువైన మూటతో యీదుకొనిరాలేక అతడు కష్టపడుతున్నాడని ఒడ్డునవున్న వర్తకుడు అనుకుంటున్నాడు. "పోనీలే! ఆ మూట వదలిపెట్టిరారా!" అని కేకవేసాడు. ఆ యేటిలో ఉన్నవాడు ఆ కేకవిని, "ఒరే! ఈ మూటను నేను వదలిపెట్టినా, ఆ మూట నన్ను వదలిపెట్టడంలేదురా!" అని మొఱపెట్టాడు. అసలు సంగతి ఏమిటని ఆలోచిస్తే, అది కంబళీమూటకాదు. అడవిలోనుంచి ఆ వరదలలో కొట్టుకొనివచ్చిన ఎలుగుబంటి అది. ఆ వర్తకుడు ఆ భల్లూకాన్ని ఆశకొద్దీ కావిలించుకున్నాడు. ఆ భల్లూకాన్ని వాడు వదలిపెట్టినా, ఆ వర్తకుణ్ని ఆ భల్లూకం వదలిపెట్టడంలేదు. ఆఖరుకు, ఆ భల్లూకాన్ని కావిలించుకొన్న ఆ వర్తకుడు నట్టేటిలో "హర హర మహాదేవ్!" అని గంగపాలైనాడు. ఆ భల్లూకపు పట్టు అటువంటిది.

రష్యాను భల్లూకాన్నికూడా హిట్లరు యిప్పుడు వదిలించుకోలేకుండా వున్నాడు. రష్యాలోని యూక్రేను పరగణాలలో కావలసినంత గోధుమ పంట ఉంది. దాని ప్రక్కనే కాకసను పర్వత ప్రాంతాలలో అపారంగా కిరసనాయిలు గనులు ఉన్నాయి. ఈ రెండు ప్రాంతాలను ఆశకొలదీ ఆక్రమించుకోవలెనని రష్యామీదకు హిట్లరు ఘరుకెత్తినాడు. యూక్రేను పరగణాలలో ప్రవేశించాడు. అక్కడికి, చేరేసరికి ఆయనగారికి తల మునకలైంది. ఇక కాకసను ప్రాంతాల్లోకి ప్రవేశించలేక పోయినాడు. ముందుకు పోలేడు. వెనుకకు రాలేడు. రష్యాను భల్లూకం జర్మను సేనలను వదలిపెట్టడం లేదు. నల్లులను నలిపినట్లుగా జర్మను సేనలను రష్యాను సేనలు నలిపివేస్తున్నాయి.

ఇటువంటి అగాధమైన యుద్ధంలోకి జర్మను సేనలను దింపినందుకు జర్మను సైన్యాధిపతులు హిట్లరును పైకి శపించలేక పోయినా, లోలోపల తిట్టుకుంటూనే ఉన్నారు. ఇంకా

రష్యా దండయాత్ర సాగించడం మా తరం కాదంటున్నారు. ఆమాట పైకి అంటే, ఆ సైన్యాధిపతులనుకూడా ఆ తిక్క శంకరయ్య కాల్చి చంపివేస్తాడు. అందుకని ఆ మాటపైకి అనకుండానే వెనక్కి అడుగువేస్తున్నారు. రష్యాకు ముఖ్య పట్టణమైన మాస్కోనగరాన్ని ముట్టడించడంకోసం, ఆ మాస్కోనగరం వరకూవచ్చిన జర్మనుసేన, అప్పుడే 130 మైళ్లు వెనుకకు పరుగెత్తింది. రష్యనులు వెంటాడి వెంటాడి వేటాడినట్లుగా, జర్మను సైన్యాలను తరిమికొట్టుతున్నారు. మధ్య మార్గంలోనే జర్మనుసైన్యం వేలకువేలుగా నేలకూలుతోంది. రష్యాలో యింతవరకూ 60 లక్షల జర్మనుసేన నష్టమైంది. ఇటువంటి అవస్థలో యీ జర్మను సైన్యాధికారులను హిట్లరు ఎట్లా నమ్ముకొని ఉంటాడు? ఇంకో జర్మను సైన్యాధికారి ఎవడైనా యీ రష్యను దండయాత్రను నడిపించగలడా? ఏ జర్మను సేనాధిపతిని అడిగినా, ఈ కార్యభారం నేను భరించలేను అని జవాబు చెప్పాడు. దాని అర్థం ఏమిటి? ఈ జర్మను సేనాధికతులందరికీ, అధైర్యమూ పుట్టింది; అయిష్టమూ పుట్టింది. వాళ్లందరిమీద హిట్లరుకు అనుమానమూ పుట్టింది. హిట్లరు అసలే అనుమానాలపుట్ట ఎవడినీ నమ్మడు. బలవంత బ్రాహ్మణార్థంగా యీ జర్మను సేనాధిపతులచేత యీ పని ఎట్లా చేయిస్తాడు? అందుకని తానే జర్మను సేనకంతకూ సర్వసేనాధిపత్యం వహిస్తున్నానని విధిలేక ప్రకటించాడు.

రష్యాలో అవస్థ యిట్లావుండగానే, ఉత్తరాఫ్రికాలో కూడా జర్మనుసేలను అక్కడి బ్రిటిషు సేనలు వెనుకకు తరిమివేస్తున్నాయి అక్కడ బెంగాజీవరకు జర్మను సేనలు వెనుకకు పారిపోయినాయి. సోలంవద్ద ఉన్న వేలకొలది ఇటాలియను సైనికులను బ్రిటిషువారు ఖైదీలుగా పట్టుకొన్నారు. రష్యాలో చలి అపరిమితంగా ఉన్నది గనుక జర్మను సేనలు అక్కడ చలికి ఆగలేక పారిపోతున్నవన్నారు. ఇక్కడ ఉత్తరాఫ్రికాలో చలి ఏముంది? ఎండలకు మండిపోయే ఎడారి భూములు అవి. ఇటువంటి లిబియాలోకూడా ఎందుకు పారిపోవాలి? చలి, చలి అంటే రష్యను సేనలకు మాత్రం చలిలేదూ? అసలు కారణం చలికాలమూ కాదు, కలికాలమూ కాదు. హిట్లరు కిది శనికాలం.

రష్యాతో యుద్ధం తెగకుండా కంఠంలోతు నీళ్లలో నట్టేటిలో హిట్లరు దిగబడివున్న యీ సమయంలోనే, అమెరికా కూడా జర్మనీ మీద యుద్ధం ప్రకటించింది. ఇంగ్లాండుమీదకు దండెత్తలేక, హిట్లరు మూడేళ్లనుంచీ ముహూర్తం ఇంకా ఆలోచిస్తునే ఉన్నాడు. అటు రష్యావారితో, ఇటు ఇంగ్లాండువారితో, ఇవిరెండూ చాలవన్నట్లుగా ఉపరి అమెరికావారితో, — మూడు బ్రహ్మాండమైన రాజ్యాలతో ఇప్పుడు ఏక కాలంలో సవాలు చేసి, చావడమో బ్రతకడమో, నిర్ణయించుకోవలసిన స్థితి హిట్లరుకు వచ్చింది. "మూడూ చేరితే వాడి చావు మూడిందిరా" అన్నట్లయింది. ఈ మూడు పెద్ద రాజ్యాలూ కలిసి తనమీదకు ఒక్కసారిగా వస్తాయని హిట్లరు ఎన్నడూ అనుకోలేదు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ ఏకమై రాక్షస సంహారం చేస్తామంటున్నారు. ఇంతకన్నా బ్రహ్మాండమైన యుద్ధం ప్రపంచం పుట్టిన తర్వాత ఎన్నడూ జరుగలేదు. ఇక ముందు జరుగబోదు. ఆ మూడు రాజ్యాలు ఏకం కావడమే హిట్లరుకు అంత్యకాలం.

బ్రిటిష్ ప్రధానియైన చర్చిల్‌గారు లోక శాంతికోశం సాధించిన మహా రాజ్యాంగ తంత్రప్రభావం ఇదే. అమెరికా ప్రెసిడెంటయిన రూజువెల్టుగారివద్దకు చర్చిల్‌గారు స్వయంగా వెళ్లి మొన్ననే మాట్లాడినారు. ప్రెసిడెంటు రూజువెల్టుగారు మొన్న 56 వందల కోట్ల డాలర్లు అనగా రమారమి 19½ వేల కోట్ల రూపాయలు ఆయుధ సామగ్రిని తయారు చెయ్యడానికి అమెరికాలో శాంక్షను చేశారు. ఈ 1942 వ సం॥లో 60 వేల విమానాలున్నూ, విమానాలను పడకొట్టేటటువంటి 20 వేల ఫిరంగులున్నూ, 45 వేల టాంకులున్నూ (అనగా ఫిరంగి మోటారులున్నూ), ఇవిగాక 80 లక్షల టన్నుల వరకు పరిమితిగల నావలున్నూ నిర్మించడానికి యీ ద్రవ్యం ఖర్చు చెయ్యవలసినదన్నారు. లక్ష్మి తాండవమాడుతున్న అమెరికా రాజ్యం అది. అటువంటి లక్ష్మికి భర్తయైన రూజువెల్టు తన పరిపాలనా చక్రం హిట్లరుమీద ప్రయోగిస్తానని బయలుదేరుతున్నాడు. అమెరికా సేనలు ఇంగ్లాండును రక్షించడానికి, హిట్లరును సంహరించడానికి బయలుదేరుతున్నవని చెప్పాడు. గజేంద్రమోక్షంలో శ్రీ మహా విష్ణువు ఒక్క గజమునే రక్షించాడు. ఇప్పుడు జగమునే రక్షిస్తానని కంకణం కట్టుకున్నారు రూజువెల్టున్నూ, చర్చిలున్నూ.

అమెరికావల్ల అనేక సరకులూ సప్లయిలూ పొందుతూ, అనేక విధాల సహాయం పొందుతూవున్న జపాను రాజ్యం నిన్న మొన్నటివరకూ అమెరికాతో తాను యుద్ధం చెయ్యడం కలలో వార్త అన్నది. అటువంటి దెన్నటికీ సంభవించదన్నాడు జపానుమంత్రి. పసిఫిక్కు మహా సముద్రంలో వున్న జపాను రాజ్యం ఒక పెద్ద లంక. పొడుగుగా వంకరగా వంగి వుంటుంది ఆ లంక. భూగోళ పటంలో చూడండి. కొంగలాగున వుంటుంది ఆ లంక. చేపలను పట్టుకొని, చేతిపనులను చేసికొని చాలామంది జపానువాళ్లు జీవిస్తూవుంటారు. పసిఫిక్కు మహాసముద్రం అనేది ఇంగ్లీషు పేరు. తెనుగులో దానినే శాంత మహా సముద్రం అంటారు. ఈ శాంత మహాసముద్రంలో కొంగవంటి యీ జపాను శాంతంగా తన వ్యాపారం తాను చేసుకుంటూ చాలా సంవత్సరాలనుంచీ కాలక్షేపం చేస్తోంది. నిన్న మొన్నటి వరకూ, అమెరికాతో తనకు ఏ విధమైన విరోధంలేదు అన్నది. ఎవరితోనూ విరోధం లేకుండా, జపం చేసుకుంటూననే జపాను అక్రమంగా తన ప్రక్కనున్న చైనా రాజ్యంమీదకు దండెత్తి జర్మనీయుద్ధం ప్రారంభంకాక పూర్వమే చైనాతో యుద్ధం సాగించింది. ఈ అక్రమయుద్ధం చాలించవలసినదని జపానుకు అమెరికా అనేక విధాల బోధించింది. కాని, ఆ మాటలు లక్ష్యం చెయ్యకుండా చైనాతో జపానువాళ్లు యుద్ధం చేస్తూనే వున్నారు. చెప్పినమాట వినకపోతే అందుకు అమెరికా ప్రాయశ్చిత్తం చేస్తానన్నది. చైనాకు కావలసిన ఆయుధ బలం అంతా అమెరికా సప్లయి చేస్తానని ప్రతిజ్ఞ చేసింది. అన్న ప్రకారంగానే సప్లయి చేస్తోంది. అమెరికా సప్లయి చేస్తున్న ఆయుధబలంతో చైనావాళ్లు ఎడతెగకుండా జపానువాళ్లతో యుద్ధం చేస్తున్నారు. చైనాతో యుద్ధం జపానుకు ఎన్నేళ్లకయినా తెగడంలేదు. నిన్నగాక మొన్న చైనాలో హూనాను పరగణాలో చాంగ్షా వద్ద 50 వేల జపాను సేన చైనా సేనలయొక్క వ్యూహంలో చిక్కుకొనిపోయింది. కత్తెరలో నొక్కుకొని పోయినట్లుగా చిక్కుకొని పోయింది. చైనాతో యుద్ధం చేస్తున్న జపాను ఇక విధిలేక, రోషావేశము హెచ్చి, చైనాకు సహాయం చేస్తున్నటువంటి అమెరికామీదకూడా యుద్ధం ప్రకటించి కత్తికట్టింది. అమెరికావారికీ చైనాదగ్గర ఫిలిప్పయిను లంకలు అనేవికొన్ని వున్నాయి. రమారమి 7 వేల లంకలు వున్నాయి. ఈ ఫిలిప్పయిను లంకలమీదకు జపాను దండెత్తింది. ఆ లంకలకు ముఖ్యపట్టణంగా ఉన్న మణిలా నగరాన్ని జపాను సేనలు ముట్టడించాయి. ఇవిగాక శాంత మహా సముద్రంలో అమెరికావారికి హవాయి దీవులు అనేవి వున్నాయి. వాటిమీదకు వెళ్లి జపాను విమానాలు బాంబులు వేసినాయి. ఈ శాంత మహా సముద్రంలో ఎన్ని లంకలువున్నాయో బ్రహ్మకైనా సరిగ్గా తెలుసునో తెలియదో. ఆకాశంలో ఎన్ని నక్షత్రాలున్నాయో అన్ని లంకలున్నా

యంటే నమ్మండి. శాంత మహా సముద్రంలో ఎన్ని చేపలున్నాయో అన్ని లంకలున్నాయని చెప్పవచ్చు. లక్షల కొలదిగావున్న ఆ లంకలన్నీ ఆక్రమించి మింగాలని ఈ జపాను కొంగ మొదలు పెట్టింది. ఇన్నాళ్లనుంచీ జపాను చేస్తున్న జపం కొంగ జపం కాబోలు! కొలను గట్టునవున్న కొంగ ఎందుకు జపం చేస్తోందయ్యా. అంటే, కంటికి కన్పించిన చేపలను పొంచివుండి మింగడానికి. జపాను చేస్తున్న బక జపం ఇప్పుడర్థమౌతూవుంది. జపాను బకం యీ శాంత మహాసముద్రంలోవున్న లంకల నన్నింటినీ మింగడం దాని జన్మలో సాధ్యంకాదు. కప్పలనుకూడా తింటారుట జపానువాళ్లు. ఈ జపాను బకమునకు ఇంత వెర్రి ఆకలి పుట్టడం వినాశకాలమేగాని మరొకటికాదు.

ఈ బకాసురుణ్ని సంహరించడానికికూడా అమెరికాయున్ను ఇంగ్లండున్నూ యేకమయినాయి. ఏకమవుతాయనే సంగతి జపాను బకానికి తెలుసు. అందుకని బ్రిటిషువారిదైన మలయా రాజ్యంలోకూడా ప్రవేశించి సింగపూరును పట్టుకోవలెనని మలయాలో యుద్ధం చేస్తున్నాడు జపానువాడు. మలయా రాజ్యంలోనుంచి బర్మా రాజ్యంలోకి రావలెనని పెద్ద ప్రయత్నం చేస్తున్నాడు. బర్మాలోవున్న రంగూను రేవుమీద బాంబులు వేస్తున్నాడు. కాని, యీ సంగతి చైనావారికి బ్రిటిషువారు తెలియజేయడంతోనే చైనా సేనలు బర్మాలోకివచ్చి జపాను సేనలను ఎదిరించడానికి సిద్ధంగా నిలువబడిఉన్నాయి. ఈ విధంగా బ్రహ్మాండమైన చైనా రాజ్యంకూడా అమెరికా ఇంగ్లాండులతో చేతులుకలిపి నిలబడింది.

"హిట్లరు మావాడే. మా పార్టీలోవాడే" అని జపాను గంతువేస్తోంది. కాని, హిట్లరువల్ల జపానుకు లభించే అర్థబలంగాని, అంగబలంగాని ఏమీ లేదు. ఒకరికొకరు సహాయం చేసుకోవలెనన్నప్పటికీ దారిగాని, మార్గంగాని లేదు. ఆ రెండూ అందుబాటులోవున్న సమీపరాజ్యాలుకావు. ఒకరికొకరు పదివేలమైళ్ల దూరాన ఉండి సలాముచేసుకోవలసినదేకాని ఉభయులూ ఏకమైచేసేది అంతకన్నా ఏమీ లేదు. ఎవరికర్మం వాళ్లు అనుభవించవలసిందేగాని, వారి కష్టానికి వీరు సహాయం చేసేదిలేదు. వీరి కష్టానికి వారు సహాయంచేసేదీ లేదు. ఇప్పుడు ఇక్కడ జపాను బకాసురుణ్ని సంహరించడానికి అమెరికా, ఇంగ్లాండు, రష్యా, చైనా రాజ్యాలు నాలుగూ ఏకమై భీకరమైన ప్లాను వేస్తున్నాయి. భీముడంత బలంతో బయలుదేరుతున్నాయి. ఈ భీమబలంవల్లనే జపాను బకాసుర సంహారం జరిగి తీరుతుంది. అక్కడ, యూరోపు ఖండంలో హిట్లరును పీల్చి పిప్పిచేస్తున్న రష్యా భల్లూకంతోపాటు అమెరికా ఇంగ్లండులు కూడా సిద్ధముగా ఉన్నాయి.

అమెరికా ప్రెసిడెంటయిన రూజువెల్టుగారు, బ్రిటిషు ప్రధానియైన చర్చిల్‌గారు, రష్యా ప్రభుత్వాధిపతియైన స్టాలిన్‌గారు, చైనా ప్రభుత్వాధిపతియైన చియాంగు కై షేకుగారు యీ నలుగురూకలసి సమాలోచన చెయ్యడానికి సిద్ధంగా వున్నారు. ఇదంతా బ్రిటిషు ప్రధానియైన చర్చిల్‌గారు చేసిన తంత్రాంగం. అందునే 1942 వ సంవత్సరంలో మాత్రం ఓపికపట్టి కష్టాలకు ఓర్చుకుంటే, 1943 వ సంవత్సరంలో విజయం మనదే అని చర్చిలుగారు మొన్న నీమధ్య స్పష్టంగా ధైర్యంగా చెప్పారు. ఈ నాలుగు రాజ్యాలూ లోకశాంతి కోసం నిర్మించబోయే విజయమంటపానికి నాలుగు స్తంభాలుగా నిలువబడుతున్నాయి. జయ విజయీభవ! దిగ్విజయీభవ!!

# మిత్రమండలి యుద్ధ వ్యూహం.

## వాషింగ్టన్, మాస్కో, చెంగ్‌కింగు సంప్రదింపులు.

### మిత్రమండలి సమిష్టినాయకత్వం : వావెలు సేనాధిపత్యం : బర్మానుండి శత్రురాజ్యంపై దాడి.

గత మూడు వారాలలో అమెరికా ఇంగ్లాండు రష్యా మున్నగు మిత్రమండలి రాజ్యముల యుద్ధవ్యూహమునకు సంబంధించిన సంప్రదింపులు చాలముఖ్యమయినవి జరిగినవి. అమెరికా ముఖ్యపట్నమగు వాషింగుటను నగరంలో బ్రిటిషు ప్రధాని చర్చిలు అమెరికా అధ్యక్షులగు రూజువెల్టుగారు కలసి వేరొకసారి సంప్రదించిరి. బ్రిటిషు విదేశాంగమంత్రి అంతోనీ ఈడెనుగారు రష్యాముఖ్యపట్నమగు మాస్కో నగరం పోయి రష్యాప్రభుత్వాధికారులతో చర్చించిరి. భారత సేనాధిపతియగు జనరలు వావెలుగారు చీనా ముఖ్యపట్నమగు చెంకింగునకుపోయి చీనా అధ్యక్షులగు మార్షల్ చంగ్ కై షేకుగారితో చర్చించిరి. ఈ చర్చల ఫలితాలు తెలియకముందే అనేకవిధములగు వదంతులు అన్నిదేశాలలో చెలరేగుచున్నవి.

హిట్లరు సేనలు లిబియాలోను రష్యాలో చాల దెబ్బతిని అచటి అమితమగు చలి భరించలేక వెనుదిరిగిన తరువాత, హిట్లరు తానే సర్వసేనాధిపత్యం వహించెను. అతడెందుకా పని చేసెనో తెలియక అనేక వూహలు బయలుదేరుచున్నవి. అతడు తన సేనలను స్పెయినుమీదుగా జిబ్రాల్టరుమీదికి పంపి, ఆరేవు నిరుపయోగం చేస్తాడని కొందరంటారు. ఫ్రాంసును ఒప్పించి ఫ్రాంసు నౌకాదళం తీసుకొని ఉత్తర ఆఫ్రికా తీరం ఆక్రమిస్తాడని మరికొందరంటారు. కాదు టర్కీ యిష్టపడకున్నాసరే టర్కీగుండా తన సేనలను పోనిచ్చి దక్షిణ రష్యాలోని కాకసనులోని, ఇరాను



ఇరాకులలోని చమురు గనులను తీసుకుంటాడని, యింక కొందరంటారు. జర్మను నాజీ లేమిచేసినా చేయకున్నా, మిత్రమండలి అధికారులుమాత్రం జపాను ఇటలీ జర్మనీ అక్షురాజ్యాలను చావగొట్టుటకు మంచి వ్యూహాలు పన్నుతున్నారు.

## 26 రాజ్యాల ఒడంబడిక.

చర్చిల్‌గారు, యింకోమంత్రి బివరుబ్రూకుగారు, మరికొందరు ఉన్నతోద్యోగులతోసహా వాషింగుటను పోయి, రూజువెల్టు అధ్యక్షునితోను అతని మంత్రివర్గంతోను, సైనికాధికారులతోను చర్చించిన ఫలితంగా, మిత్రమండలి సమిష్టి సైనికచర్యలు అతిబ్రహ్మాండమైనవి నిర్ణయింపబడినవి. బ్రిటను, అమెరికా, రష్యా, చీనా, నెదరులండు, ఇండియా మున్నగు దేశాలు 26 ఒక ఒడంబడికయందు సంతకం చేసినవి. ఇండియాతరఫున సర్ గిరిజాశంకరబాజపాయిగారు సంతకం చేసిరి. అట్లాంటికు ప్రణాళికను అంగీకరించి అనుసరించునట్లు ప్రకటించి, యింకను యిట్లు తెలిపినవి :—

1. "జర్మనీ ఇటలీ జపాను రాజ్యాలపైగాని, వాటి మిత్రరాజ్య ఒడంబడికనామోదించు యితర రాజ్యాలపైగాని, యీ ఒడంబడికయందు సంతకంచేసిన ప్రతిదేశ ప్రభుత్వం యుద్ధం చేయుచున్నపుడు పూర్తిగ ఆర్థిక సైనిక ప్రతికూల చర్యలు గైకొనుటకు శక్తివంచన లేక పాటుబడును.

2. శత్రువుతో ప్రత్యేకంగా రాజీపడకుండుటకును సంధి చేసుకొనకుండుటకును యీ ప్రభుత్వాలన్ని ఒడంబడినవి."

నూతనవత్సర సంకల్పములన్నింటిలో శ్రేష్టతమమైనదిది. రక్త శిక్తమయిన దేశాలన్నింటికి యీ ప్రకటన ఉత్సాహం కలిగించగలదు. అంతేకాక అక్షరాజ్యాలన్ని తమనాశనమునకు యిన్ని ప్రభుత్వాల శక్తులు కలసి కృషిచేస్తున్నాయని హడలిపోగలవు.

వాషింగుటను సంప్రదింపుల ఫలితంగా చేకూరిన యింకో మేలేమంటే, అమెరికా అరువు కౌలుచట్టం ముందే ప్రయోజనముల కుద్దేశింపబడినదో అందుకు నిజంగా యిపుడుపయోగింపబడును. బ్రిటను, అమెరికా, రష్యాలు ఏ రాజ్యం తయారుచేయదలచిన యుద్ధ పరికరాలను ఆ రాజ్యం అతి వడిగా తయారుచేసి, డాలరు లెక్కల చికాకులేకుండా సరకునకు సరకు బదలీగా మార్చుకొని, ఏ యుద్ధ రంగాలకు ఏ రకం పకరాలు ఆయుధాలు అవసరమో, అక్కడకు వాటిని పంపుటకు ఒడంబడిక చేసుకొన్నవి. వీటిని రవాణా యేర్పాటు చేయుటకుగూడా షిప్పింగు కంట్రోలు కౌన్సిలు ఒకటి నియమింపబడినవి. ఫిరంగులు, టాంకులు, విమానాలు ఎక్కడ ఎంత వడిగా తయారు చేయగలుగుతే అంత వడిగా తయారు చేయబడును. ఆహార పదార్థములుగూడ ఆ ప్రకారమే తయారుచేయించి రవానా చేయబడును.

## ఇంగ్లాండు, రష్యా.

వాషింగుటనులో సంప్రదింపులు జరిగినపుడే మాస్కోలో ఈడెను స్టాలిను మలటావ్‌గార్లు సంప్రదించిరి. టర్కీ, ఇరానులలోనున్న బ్రిటిషు ప్రభుత్వ రాయబారులుగూడ వచ్చి మాస్కోలో ఈడెనగారిని చూచిరి. ఈడెనుగారి వెంట సామ్రాజ్యసేన ఉపాధ్యక్షుడుండెను. హిట్లరు అధికారమునందున్న జర్మనీని పూర్తిగ ఓడించి తిరిగ జర్మనీ దురాక్రమణచేయకుండా నుండునట్లు యుద్ధం జయప్రదంగా కొనసాగించుటకు బ్రిటను-రష్యాలు ఏకదీక్ష ప్రకటించినవి. యుద్ధానంతర కర్తవ్యంగురించికూడా ఉభయరాజ్యాల ప్రతినిధులు చర్చించుకొనిరి. రష్యా, ఇంగ్లాండులు యికముందు యింకా సన్నిహితంగా అన్యోన్యంగా పనిచేయుటకు యీ సంప్రదింపు లెంతయు తోడ్పడినవని రెండు ప్రభుత్వముల సమిష్టి ప్రకటనయందు తెలుపబడెను.

## చీనాతో.

ముఖ్యమగు మూడో సంప్రదింపులు చంకింగులో జరిగినవి. భారత సేనాధిపతియగు జనరలు సర్ ఆర్చిబాల్డు వావెలుగారు డిశంబరు 24 వ తేదిన రంగూనునుండి చంగుకింగు చేరి మార్షలు చియంగుకాయి షేకుగారితో సమిష్టి యుద్ధ యత్నములగూర్చి చర్చించిరి. చంగుకింగులో సైనికాధికార సంఘం నియమింపబడింది. పశిఫిక ప్రాంతములందు అమెరికా, బ్రిటను, చీనా; డచ్చి ప్రభుత్వాలను మరింత అన్యోన్యమొనర్చి సమిష్టి సైనికచర్యలను మరింత వృద్ధిచేయుటకు యీ సంప్రదింపులు తోడ్పడినవి. జపాను ద్రోహంచేసి దాడి ప్రారంభించి తొలి విజయము పొందగనే ఆస్ట్రేలియాకు కొంత భయం కలిగింది. ఆస్ట్రేలియా ప్రధాని వాషింగుటనులోనున్న రూజువెల్టు చర్చిల్‌గార్లకు ఏకాయెకిని తంతివార్తపంపి పశిఫికు రక్షణకు వెంటనే చర్య గైకొనవలెనని హెచ్చరించెను. దానికి బదులుగా వారు ధైర్యము చెప్పుచు జనరలు వావెలుగారిని పశిఫికు నైరుతి ప్రాంతముల సర్వ సేనాధికారిగా నియమించినట్లు ప్రకటించిరి. అమెరికా నౌకాదళాధికారి అడ్మిరలు హార్టుగారు ఆ ప్రాంతముల నౌకాదళాధికారిగా నుందురు. కాని వావెలు ఉత్తరవుల ప్రకారం పనిచేయుదురు. అదివరకున్న బ్రిటిషు సేనాధికారియగు సర్ హెన్రీపానువెలుగారు వావెలుక్రింద సేనాధికారిగా నుందురు. వీరు సింగపూరులో సేనాధిపత్యం ఇటీవలనే సర్ రాబర్టు బ్రూకు పాఫేముగారివద్ద గైకొనిరి.

చీనా యుద్ధరంగమునందు మిత్రమండలి సేనలు విమానదళములన్నింటికి నాయకులుగా చీనా అధ్యక్షుడు మార్షలు చంగుకాయిషేకగారు నియమింపబడిరి. పశిఫికు నైరుతి ప్రాంతములలో సింగపూరు, మలయా, డచ్చిదీవులు, ఫిలిప్పైను దీవులు చేరియున్నవి. ఫిలిప్పైనలులో అమెరికా సేనాధిపతి మెక్ఆర్థరుగారు అపుడే జపాను సేనలను తీవ్రంగా ఎదుర్కొని పట్టుదలతో పోరుచున్నారు. ఈ సైనికోద్యోగుల మార్పులన్ని ఆస్ట్రేలియాకు సంతృప్తికరముగ నున్నట్లు ప్రధాని కర్టినుగారు ప్రకటించిరి. అమెరికా యుద్ధనౌకలు తమ ఆస్ట్రేలియా తీరమునందు స్థావర మేర్పగచుకొని పోరాడగలవని అతడనెను.

## రష్యావైఖరి.

పశిఫికు ప్రాంత యుద్ధం గూర్చి రష్యావైఖరి యెట్లున్నదో చూద్దాం. అక్షరాజ్యాల ప్రతికూల ఒడంబడికలో (26 ప్రభుత్వాలది) రష్యా చేరియున్నా, జపానుతో యుద్ధమునందు రష్యా తటస్థంగా నుండుటకు ఆక్షేపణలేదు. రష్యా జపానుతో యుద్ధానికి దిగినట్లు ఎంచకుండుటకు కారణాలు యీ దిగువ రీతిగలవు:—(1) రష్యా జపానులకు ఐదేండ్ల తటస్థ ఒడంబడిక యింకను అమలునందున్నది. (2) హిట్లరుపై స్వశక్తులను వినియోగించి ఓడించుటవల్లనే జపాన్నుగూడ త్వరగ వోడించుటకు సాధనమని రష్యా నమ్ముచున్నది (3) రష్యా జర్మనీతో పాటు జపానుతోగూడ యుద్ధం ప్రకటించి, సైబేరియాలో శిబిరాలనుండి జపానపై దాడి సలిపి బాంబులు వేసినచో ఎక్కువ లాభముండునని రష్యా నమ్ముటలేదు. జపానుపై జయప్రదంగా బాంబుల దాడి జరిపినా దక్షిణ పశిఫికు రాజ్యాలందు జపాను దాడి అంకట్టబడదని రష్యా నమ్ముచున్నది. అయితేనేమి, జపాను తనపై ద్రోహంచేసి దాడి వచ్చినచో తిరిగి కొట్టుటకు రష్యా సైబేరియాలో పెద్దసైన్యం ఉంచింది.

జనరలు వావెలుగారిని ఇండియా సేనాధిపత్యంనుండి మార్చి, పశిఫికు ప్రాంతాల సమిష్టి సేనాధిపత్యం యిచ్చిరి. వారిస్థానే ఇండియా సేనాధికారిగా ఎవరిని యింకను నియమించలేదుగాని, తిరిగి జనరలు ఆచిన్‌లెక్‌గారనే నియమిస్తారనుకుంటున్నారు. వీరు ప్రస్తుతం సిరనైకాలో జర్మను సేనలను తరుమగొట్టి విజయం పొందిరి. వావెలుగారు డిల్లీలో వీడ్కోలు ఉపన్యాసము నొసంగుచు, అన్ని ప్రభుత్వాల సైనిక శక్తులను కేంద్రీకరించి, వలయానంత త్వరలో శత్రు నిర్మూలనం చేయుటకే, స్థిర సంకల్పం చేసికొన్నట్లు, యీ సర్వసేనాధిపత్య నిర్ణయం రుజువు చేయుచున్నదనియు, చివరకు గెల్పుట నిశ్చయమే అయినా కొన్ని కష్టాలు లేకపోలేదనియు చెప్పిరి. "పోలీసువారు వచ్చేలోపున అశ్రద్ధగనున్న అమాయికుడగు పెద్ద మనిషిపైబడి దోచుకన్న హంతకునివలె జపాను ప్రారంభంలో కొంత విజయంపొందినా, పరిస్థితులు మారగలవు; మారేలోపున యింకా కొంతనష్టం కూడా కలుగవచ్చును. హాంగ్ కాంగులో బ్రిటిషు ఆస్ట్రేలియను, భారతీయ సేనలు చాల అద్భుతంగా పోరాడినవి. రాయలు విమానాలు, డచ్చివిమాన దళములు, డచ్చి నౌకాదళములు బాగుగా తోడ్పడినవి. ఈ దేశాలన్నింటి సమిష్టి చర్యలను చివరకు జపాన్ని ఓడించక తప్పవు. 1940 వ సంవత్సరములో ఫ్రాంసు పడిపోగానే యూరోపులో వుండినట్లు యిపుడు పశిఫికు పరిస్థితులున్నాయి. తిరుగు దెబ్బ కొట్టుటకు క్రొత్తశక్తి సహాయం వచ్చువరకు, నిలచియుండుటకు యిపుడు సమర్థతగలదు. అమెరికా, బ్రిటను, ఆస్ట్రేలియా, చీనా, డచ్చిదేశాల సేనలన్నికలసి చివరకు జపానుదుండగీండ్రను అణచివేయ జాలవను అనుమానం నాకెన్నడులేదు." అని వావెలు సేనాని తెలిపెను.

# రష్యా నావికుడు.



రష్యా యుద్ధ నౌకపైనున్న నావికుడొకడు టార్పిడో యంత్రమును ఉపయోగించుట.

## బర్మా ప్రాధాన్యత.

ఇండియాయొక్క భద్రత అంతా యిప్పుడు పసిఫికు యుద్ధంపై ఆధారపడియుంది. బర్మా నిజంగా యిప్పుడు ఇండియాకు రక్షణ శిబిరంగానుంది. ఇండియాలో జనరలు స్టాఫ్ ఛీఫ్‌గావుండిన లెఫ్టినెంటు జనరలు టి. జె. హటును గారు బర్మా సేనాధిపతిగా నియమింపబడిరి. జపాను దాడుల నెదిరించుటకు వీరు కడు సమర్థులు. బ్రిటిషు సేనలోగాని, ఇండియా సేనలోగాని వీరంతవారులేరు. అయితే శత్రువు నేర్పుగూడ తక్కువైందికాదు. మలయాలోని దట్టమైన అడవులనుగూడ జపాను సేనలు దాటినవని తెలిసింది. కావున అశ్రద్ధచేయ వీలులేదు. బర్మా తీరపు రేవులు జపాను వశమయితే, అచట విమాన కేంద్రాలు స్థాపించి బంగాళాఖాతమునందు మననౌకలు తిరగకుండా చేయగలరు. బర్మాలోని రంగూనునుండే చీనాకు యుద్ధ సామగ్రి సప్లై అగుచున్నది. కావున బర్మా రక్షణయందు చీనాకుగూడ శ్రద్ధ అవసరం గలదు. అందుకై చీనా సహాయం తెచ్చుకొనుటకే వావెలు గారు చంగుకింగునకు పోయివచ్చిరి. చీనా సేనలు అప్పుడే బర్మావచ్చి బర్మా రేవులందుంచబడినవి. బర్మా విమాన దళమునకు నాయకుడుగ వైస్ మార్షలు స్టీవెన్సనుగారు నియమింపబడిరి. వీరు ఇంగ్లాండులో పగలు బాంబులు వేయు విమానదళం జట్టు నాయకుడుగానుండి వచ్చిరి. వీరు బర్మా నుండి జపాను ఆక్రమించిన సయాంమున్నగు ప్రాంతములకు బాంబరు విమానాలనుపంపి తీవ్రముగుదాడి జరుపగలరు.

# పసిఫికు యుద్ధం.

## మిత్రమండలి సేనలు తిరుగు దాడులు చేయుట.

పసిఫికు యుద్ధక్రమంలో అతిముఖ్యమైన కార్యం జనరలు వావెలుగారిని మిత్రమండలి రాజ్యాలన్నింటి సేనాధికారిగ నియమించుటే. ఇందువలన ప్రజాప్రభుత్వరాజ్యాలు యికముందు అతిచురుకుగ పనిచేసి, జపాను ద్రోహంచేసి ప్రారంభంలో గెలిచిన గెలుపు నిరుపయోగంచేయుటేగాక, చర్చిల్ గారు చెప్పినట్లు తిరుగుదాడులు జరిపి, మరువరాని పాఠం జపానుకి నేర్పవచ్చును.

ప్రారంభంలో శత్రువు చొరవవలన బ్రిటను అమెరికా సైన్యాలకు మంచిదెబ్బే తగిలింది, కాదనలేం. కాని మిత్రమండలి రాజ్యాలు యిప్పుడిప్పుడే తమ శక్తులను కూడగలుపుకొనుచుండ, జపాను శక్తి అప్పుడే అణగుచున్నట్లు చిహ్నాలగుపడుచున్నవి. మలయా, ఫిలిప్పైను దీవులందు అప్పుడే మిత్రమండలి సేనలు తిరుగుదాడులు సల్పుచున్నవి.

గత యుద్ధ సంచిక ప్రచురించి మూడు వారాలయింది. ఈ మూడు వారాలలో జపాను సేనలు చీనా పడమటి తీరానవున్న బ్రిటీషువారి దీవియగు హాంగుకాంగును వశపరచుకొన్నవి. అయితే, ఆ ఆక్రమణయందు చాల నష్టపోయింది. అక్కడనున్న బ్రిటిషు భారతీయ, కెనడా సైనిక దళములు ఒక వారంవరకు నిరోధించి, చివరకు ఒక చుక్కైన త్రాగే నీరులేక లొంగిపోయినవి. అన్ని రోజులు వారు శత్రువును నిరోధించుటవలన, యితర రంగాలలో మిత్రమండలి సేనలకు వ్యవధి లభించెను. ఇంతకు హాంగుకాంగు చిరకాలం జపాను

చేతుల్లోనుండబోదు. చీనా సేనలు పడమరను కాంటన్ నుండి కవులూనువరకు (హాంగుసకు యెదురుగా ఏషియా తీరాన వున్న నగరం) మార్గములను చెడగొట్టుచున్నారు. చంగ్షా వైపు దాడిసలిపి, యీ చీనా సేనల దృష్టి మరల్చాలని జపాను సేనలు యత్నించినవి. కాని చంగ్షావద్ద యుద్ధంలో జపాను సేనలు 50,000 చచ్చుటతో, గాయపడుటతో జరిగి త్వరగ పారిపోయినవి. చీనా ప్రాంతముల మిత్రమండలి సేనలన్నింటికి సర్వ సేనాధికారిగా మార్షలు చంగుకాయి షేకుగారు నియమింపబడిరి. వారు తమ సేనలు కొన్నింటిని ఆయుధపరికరాల సహితంగా బర్మాకు పంపిరి.

### 66 జపాను విమానాలు పడ్డాయి.

బర్మాలోని సైనికదళం కొద్దివారాలలో మూడింతలు పెంచబడినది. తాయిలాండును వశపరచుకోగానే బర్మా దక్షిణ కొసనున్న విక్టోరియా పాయింటు నాక్రమించిన జపాను సేనలు ముందుకు పోజాలకపోయినవి. జపాను విమానాలు రంగూను నగరంపైని, యితర బర్మా నగరాలపైని దాడి చేసినవి. రంగూనుపై ప్రథమ దాడిలో, సివిలు ప్రజలు హెచ్చరిక తెలుపగనే దాగొనకుండుటచే చాలమంది చనిపోయిరి. రెండోసారి శత్రువిమానాలు రాగానే వారట్టి పొరబాటుచేయనందున, చెప్పకోదగ్గ నష్టం యేమి కలుగనే లేదు. అంతేకాక జపానువారికే యెక్కువ నష్టంకలిగెను. రంగూనుపై జరిగిన నాల్గు విమానదాడులలో అమెరికా చీనా వైమానికుల సహాయంగల రాయలు విమానదళము విమానాలు జపాను విమానాలను యెదిరించి పోరాడి, 66 విమానాలను పడగొట్టినవి ; తమకు చాల కొద్దిగ నష్టంకలిగెను. బర్మా, క్రొత్త కమాండరు హట్టనుగారి నాయకత్వమున యింకను యెక్కువ జయప్రదంగా పోరాడగలదు. తాయిలాండుపై అపుడే బర్మా విమానాలుపోయి దాడి సలుపుతున్నవి.

### మలయా యుద్ధం.

తాయిలాండు జపానుకి లొంగిపోఒట్టి శత్రుదేశమయింది. లేకుంటే మలయా యిపుడీ స్థితిలోనుండేదికాదు. ఇపుడు మిత్రమండలి సేనలు, దాడివచ్చిన శత్రు సేనలకు చాలనష్టం కలిగించుచు, తాము రక్షించుకొనుచు, ఒక చోటువిడచి అంతకన్న భద్రమగు వేరొకచోటికి పోవుచున్నవి. వెలస్లీ రేవు, చెమారు, ఇపో నగరాలు ఖాళీచేయబడినవి. ఇపోలో టిను పరిశ్రమ యెక్కువగనున్నది. మలయ ముఖ్యపట్నమగు కౌలాలంపూరునకు 70 మైళ్లు ఉత్తరమున బిడారునందు యిపుడు సామ్రాజ్య సేనలు స్థావరమేర్పరచుకొనియున్నవి. ఇప్పటివరకు యీ సేనలు తమకన్న యెక్కువ సంఖ్యగల జపాను సేనతో విమానాల సహాయంలేకుండా పోరుచున్నవి. జపాను సేనకు వారి విమానాల సహాయం చాలావుంది. ఇదివరకు రాయలు విమానదళాలు లిబియాకు, రష్యాకు పంపబడుటచే యిట్లయింది. కాని త్వరలో యీ స్థితి మారిపోగలదు. పూర్వ ప్రాంతాలన్నింటికి రక్షణ శిబిరమగు సింగపూరు యింకను చెక్కుచెదరకయున్నది ; జపాను దాడు లన్నింటిని సింగపూరులోనున్న నౌకా విమానదళము లన్నియు తరిమివేయగలవనుట కెట్టి సందేహంలేదు.

### రోజుకో జపాను స్టీమరు మునుగుతున్నది.

సింగపూరు పడిపోకపోయిన, అక్కడనుండి యితర చోట్లకు సహాయంవెళ్లకుండా, ఆ శిబిరాని నిరుపయోగంచేసే వుద్దేశంతో చేరువనున్న సుమాత్రా జావాలందు జపాను సైన్యాలు దిగినవి. జపాను నేల సైన్యాలు యెక్కడ కొంత విజయంపొందినా, సింగపూరు శక్తిహీనం చేయబడేవరకు ఒక్క జపాను నౌకగూడ ఆ స్రోవదాటి హిందూ మహాసముద్రంలో చేరజాలదు. సింగపూరు నౌకాదళానికి తోడుగ డచ్చి దీవుల నౌకాదళమును, విమాన దళములను పంపబడినవి. అవి యిపుడు దినానికొక జపాను నౌక చొప్పున ముంచి వేయుచున్నవి. ఇంతలో అమెరికానుండి సహాయం రాగలదు. అమెరికా పశిఫికు నౌకాదళం పడమర పశిఫికు ప్రాంతములకు వచ్చుచున్నది.

పాపం, అమెరికావారి ఫిలిప్పీను దీవులలో ముఖ్యపట్నమగు మణిలా రేవు శత్రువశమగుటచే, దానికి చేరువగ నుండిన కావిటెయను నౌకా శిబిరం ఉపయోగించుటకు అమెరికా నౌకాదళమునకు వీలులేదు. మణిలా సైనికులచే ఖాళీ చేయబడిన అరక్షితనగరమని ప్రకటించినాగూడ క్రూరులగు జపానువారు లక్ష్యంచేయక సివిలు ప్రజలను దారుణంగా చంపిరి. అచటనున్న అమెరికా సేనాధికారి మకార్థరు గారు ప్రతిక్రియ చేయదలచిరి. వారి సేనలు మణిలాకు ఎదురుగ మణిలా బేద్వారమువద్దనున్న కోరిగడారును దిట్టపరచి రక్షించుచున్నవి. అది దిట్టంగానున్నంతకాలం మణిలా, కావిటు రేవులను శత్రువు లుపయోగించలేరు. అమెరికా సేన ఫిలిప్పీను సేన మణిలాకు వాయువ్యదిక్కున కొన్ని శిబిరాలేర్పరచుకొని యీ వారంలో జపానువారికి యిదివర కెరుగనంత ఓటమి కలిగించిరి. రెండు వైపులనుండి దాడి రాదలచిన జపాను సైన్యం ఎత్తు విఫలమై 700 మంది జపాను సైనికులు యుద్ధరంగంలో చచ్చిపడిరి. మిత్రమండలి సైన్యాలు అధికంగా వచ్చి తోడ్పడేవరకు ఫిలిప్పీను దీవులు రక్షింపబడగలవు. ఆ సహాయం ఎక్కువగనే వస్తున్నదని అమెరికా ప్రభుత్వం తెలిపెను.

---

## రంగూను విమానదాడిలో గుణపాఠం.

### దాగొనే విధం.

డిసంబరు 23 వ తేదీన రంగూను నగరంపై జపాను బాంబరు విమానాలు, ఫైటరు విమానాలతో సహా అనేకం వచ్చినవి అవి సివిలు ప్రజలపై బాంబులు వేయుటకే వచ్చినవనుటకు సందేహంలేదు.

జపాను విమానాలు చాల పడగొట్టబడినవి.

ప్రజలు వీధులలోకి ఎక్కువమంది వచ్చి నిలిచినచోట్ల చావులెక్కువ, దాగొన్నచోట్ల తక్కువయుండెను. ఇండ్లలోగాని, గోతులు లేక పెట్టెలందు దాగొన్నవారికి నష్టం కలుగలేదు. ప్రజలు దాగున్న ఒక తావునందు ఒకరునూ చావలేదు. కొద్దిమందిమాత్రం గాయపడిరి.

రంగూను దాడివలన నేర్చుకోవలసిందేమంటే, హెచ్చరిక చేయబడగానే ఏదేనా కప్పుక్రిందకు పారిపోయి దాగొనవలెను. బాకాలు ఊదగానే ప్రజలు చెప్పినట్లు గని యిండ్లలోనికి పోయియుంటే, బాంబు ప్రేలిన తరువాత పై కెగరు తునకలవలన ప్రమాదాలు యింత యెక్కువయుండేవి కావు.

కావున ప్రజలంతా హెచ్చరిక తెలుపబడగానే యిండ్లలో దూరిపోవాలి, లేదా ఆరుబయట నడుస్తుంటే ఏదేని కప్పు క్రిందకు పోవలెనని ప్రభుత్వంవారు ఘట్టిగా చెపుతున్నారు.

అట్టే లోతులేని చిన్నగోతులు ఇండ్ల వాకిళ్లలో త్రవ్వుకొని అందులో దూరి ఒక పరుపో టేబిలో పైన కప్పుకున్నచో ఏమి ప్రమాదం ఉండదు.

# హాంగుకాంగు భారతీయ సేనలు.

బ్రిటిషు దీవియగు హాంగుకాంగు, జపానునకు దక్షిణ పశ్చిమ దీవులకు మధ్యగా నుండుటచే, జపాను సేనలు దిగువకు దాడి వచ్చునపుడు మధ్య మకామగా నుండగలదను ఉద్దేశంతో యుద్ధం ప్రారంభించగానే, జపాను హాంగుకాంగుపై దాడి సలిపెను. అక్కడ బ్రిటిషు, కనడా భారతీయ సైనికదళము లపుడుండెను. అవి ఒక వారం రోజులు ఆ దీవిని రక్షింపగల్గినవి. అందు భారతీయ సేనల కృషినిగూర్చి బ్రిటిషు ప్రభుత్వంవారు ఇండియా ప్రభుత్వంవారికి కృతజ్ఞత దెలుపు యీ దిగువ సందేశమంపిరి:—"భారతీయ సైన్యమును, హాంగుకాంగు సింగపూరు రాయలు ఆర్టిలరీదళం సైనికులును, హాంగుకాంగు మ్యూలుకోరువారును ఆ దీవి రక్షణయందు అత్యద్భుతమగు వీరత్వము చూపినందుకు బ్రిటిషు ప్రభుత్వమువారు కృతజ్ఞతతో ప్రశంసించుచున్నారు. ఎక్కువ సంఖ్య శత్రుసైన్యాలతో అద్భుతంగా పోరు సల్పుట యందు చనిపోయినవారికై విచారించుచు, వారి బంధువులకును శత్రువులకు ఖైదీలుగా చిక్కినవారి బంధువులకును తమ సానుభూతిని తెలుపగోరుచున్నారు. అధిక సంఖ్యాకమైన శత్రువులతో యిటువంటి పోరు సలుపుటవల్లనే తరుచు మహాసంగ్రామములందు యితరచోట్ల పోరుసల్పుచున్న తమ సేనకు విశ్రాంతి కలుగుచుండును. హాంగుకాంగు సైనికదళము కాలై, క్రీటు రక్షకులవలె పేర్గాంచగలరు. కష్టదశయందుగూడ వీరత్వంచూపి, అంత్యవిజయమునకు తోడ్పడినవారగుదురు."

# చర్చిల్ అమెరికా ఉపన్యాసములు.

**1942 వ సం॥ గడ్డుగాను 1943 వ సం॥ మెరుగ్గాను వుంటుంది.**

బ్రిటిషు ప్రధానమంత్రి విన్‌స్టన్ చర్చిలుగారు డిశంబరు 26 వ తేదిన అమెరికా శాసనసభయగు సెనేటులో ఉపన్యసిస్తు తన తల్లి అమెరికా దేశీయురాలేననియు, అమెరికా ఇంగ్లాండులు రెండును ప్రజాప్రతినిధి ప్రభుత్వములే యగుటచేతను, రెండింటికి యిపుడు ఒకేవిధమగు ప్రమాదము సంభవించినందునను, వాటి నెదుర్కొనుటకు సైనిక వ్యూహము లాలోచింపవచ్చితిననిరి. వారు యిట్లు దెలిపిరి:—

"ఎట్టకేలకు అమెరికా-సంయుక్త రాష్ట్రాలపై యుద్ధం ప్రారంభమయింది. మూడు బలీయమైన డిక్టేటరు రాజ్యాలు యీ యుద్ధాన్ని ప్రకటించినవి. అవేవన, యూరోపులో అతి శక్తివంతమయిన మిలిటరీ రాజ్యం జర్మనీ ఒకటి; ఏషియా ఖండమంతకు అతి శక్తివంతమయిన మిలిటరీ రాజ్యం జపాను మరొకటి; మూడోది, ఇటలీ వీరితో చేరింది.

"మనపై కత్తికట్టిన రాజ్యాల శక్తి అపారమయినది. మనకున్న ఆయుధబలము అంగబలము శత్రువుల ఆయుధ అంగబలాలకంటె ఎక్కువే. ఇప్పటివరకు మనం మన బలసంపదలో కొంత భాగాన్ని మాత్రమే ఉపయోగించేము. క్రూరమయిన యుద్ధ విధానంలో మనం నేర్చుకోవలసిన అంశాలు ఎన్నో కలవు. మనం కఠిన పరీక్ష నెదుర్కొనవలసియున్నదన్న అంశం నిర్వివాదమైనది. అనేక ఆశాభంగాలూ, ఆకస్మిక సంఘటనలూ మనలను ఎదుర్కొబోతున్నవి.

1940 వ సం॥ జూన్ మాసంలో ఫ్రెంచి పతనానంతరమే జర్మనీ బ్రిటిషు దీవులపై దండయాత్ర ప్రారంభించివుంటే, దాదాపు అదే సమయంలో జపాను-బ్రిటను-అమెరికాలపై యుద్ధాన్ని ప్రకటించివున్నట్లయితే, మనం ఎంతటి ప్రమాదాలకూ, ఆవేదనలకూ పాల్పడవలసి వచ్చియుండుమో యెవరమూ చెప్పలేము.

ఇపుడు 1941 వ సం॥ ఆఖరులో యీ పరిస్థితు లెదుర్కొడంవలన మన సుఖశాంతి ప్రదమగు కార్యాలనుండి పూర్తిగ యుద్ధకార్యాలకు మార్చుటలో చాల కృషిచేసితిమి. ఇంగ్లాండున కెంతో మందుగుండు సామానులు ఆయుధాలు వస్తున్నవి. అమెరికాలో అన్ని పరిశ్రమలు యుద్ధ పరిశ్రమలుగా మార్చుట కెంతయో కృషి జరిగెను. ఇపుడు అమెరికాగూడ యుద్ధంలో దిగింది కనుక యింకనొక ఏడాదిలోను లేక 18 మాసాలలో, నియంతరాజ్యాలెన్నరుంగని మార్పులు యుద్ధంలో సంభవిస్తాయి. ఇంగ్లీషుమాట్లాడే ప్రజలందరి అంగబలాన్నీ బుద్ధి బలాన్నీ, శక్తిసామర్థ్యాలనూ, మనో నిబ్బరాన్నీ ప్రదర్శించినట్లయితే 1942 వ సంవత్సరాంతానికి తప్పకుండా పరిస్థితులు యిప్పటికంటె మెరుగ్గా వుంటవనే భావించవచ్చు. 1943 వ సంవత్సరములో మనం పెద్ద ఎత్తుని ఎదురుదాడి సాగించడానికి వీలుంటుంది.

"శత్రు సైనికబలం ఇప్పటికే బ్రహ్మాండమయిన దెబ్బ తినివున్నది. రష్యను సేనలు ప్రజలును స్వదేశ రక్షణార్థం సాగించిన అమోఘ యుద్ధ ఫలితంగా జర్మను సేనలకు ఈ పెద్ద దెబ్బ తగిలింది. గర్విష్టియైన ముసోలిని కూలిపోయి, నాజీ జర్మనికి బానిస అయినాడు. అతని ఆఫ్రికను సామ్రాజ్యం అంతరించింది. అబిసీనియా తిరిగి స్వాతంత్ర్యం పొందినది. ఫ్రాంసు మోసంచేసి లొంగిపోయినపుడు బలహీనంగా సరకు లేకుండాయున్న మా సేనలు, యిపుడు టెహరానునుండి బెంఘాజివరకు, అలిప్పో, సైప్రెసులనుండి నైలు నదివరకు ఆక్రమించినవి. లిబియాలో తిరుగు దెబ్బ కొట్టాలని కొన్ని నెలలనుండి అనుకొంటూ వుంటిమి. ఆరు వారాలనుండి ఆ యెడారిలో జరుగుచున్న యుద్ధాలు అతి తీవ్రంగా జరుగుచున్నవి. సరఫరాలలో వున్న యిబ్బందుల వల్ల శత్రు సేనల సంఖ్యను మించిన సంఖ్యగల సైన్యమును మేమక్కడ దించలేకపోయినాము. అందుచేత ఇంగ్లాండు-అమెరికాలందు తయారైన ఆయుధాలు పరికరాలతో నెదుర్కొని, ఎక్కువగ టాంకులు విమానాలపై ఆధారపడవలసివచ్చెను. తగిన ఆయుధాలు లభించేసరికి శత్రువును బాగా ఓడించగలిగినాము. సైరినైకాలో శత్రు సాయుధదళాలు 1,500,000 గలవు. వీరిలో మూడోవంతు జర్మనులు. సర్ అచిను లేకుగారు వీరిని పూర్తిగ ఓడించడానికి ప్రయత్నిస్తున్నారు. అతని లక్ష్యం నెరవేరుతుందని నమ్ముచున్నాను. పశుతుల్యులైన నాజీల తలప్రాణం తోకకు తెస్తున్నామని తెలియజేయడానికి సంతోషిస్తున్నాను. ప్రస్తుతం హిట్లరు పడుతున్న అవస్థలన్నీ ఇకముందు అనుభవించబోయే దురవస్థలకు సూచన ప్రాయాలే."

## జపాను యుద్ధం.

జపాను యుద్ధ ప్రకటనగూర్చి దెల్పుచు చర్చిలుగారిట్లు నుడివిరి.

"ఆకస్మికంగా ఘాతుకంగా జపాను దండయాత్ర ప్రారంభించిన కారణంగా మన ఉభయ రాజ్యా[illegible] ఇంగ్లాండు) ప్రమాదకరమై[illegible] ఆకస్మికంగా యేర్ప[illegible]

సిద్ధపడియుండలేము. ఇంగ్లాండులో అడిగితే ఎక్కడ కూడ ప్రజలు నన్ను, మలయా తూర్పు దీవులకు తగినంత విమానాలు ఆయుధాలు ఎందుకు పంపలేదని అడుగుతే, లిబియాలో అచినులేకుగాని విజయాలే జవాబుగా సూచింతును. లిబియాకునూ తూర్పునకుగూడ పంపితే, రెండుచోట్ల చాలకుండా పోవును. బ్రిటిషు దీవులకును, లిబియాకును, అట్లాంటికు ప్రాంతాలకు అమెరికా ఎక్కువ సామగ్రి పంపుచుండుట్లచేతనే పసిఫికు సముద్ర ప్రాంతములందు యిపుడు కొంచెం వెనుకపడి యుండెను.

ఐదారు సంవత్సరాల క్రిందట అమెరికా ఇంగ్లాండుతో కలిసియుంటే, జర్మనీచేత గత యుద్ధానంతరం ఒడంబడికలో సంతకంచేసిన ప్రకారం ఆయుధ విసర్జనమ్ము, ఒక్క నెత్తురు బొట్టు పడకుండా, చేయించియుండేవి. ఇపుడు అట్లాంటిక్కు ప్రణాళికలో, గెల్చిన రాజ్యాలకు ఓడిన రాజ్యాలకూ కూడా యిస్తామన్న ముడి పదార్థాలు అపుడే జర్మనీకి లభించేటట్లు చేసియుండవలసింది. కాని ఆ సదవకాశం గడచిపోయింది. మనలను ఏకీభవింపజేయడానికి విధి యీ రీతి సుత్తి పెట్లు పెట్టింది. భవిష్యత్తులోని రహస్యాన్ని చూడగల శక్తి మనకు ప్రసాదింపబడలేదు. అయినా భవిష్యంలో తమ శ్రేయస్సుకోసం, ప్రపంచ శ్రేయంకోసం, బ్రిటను అమెరికా ప్రజలు ఏకీభవించి శాంతిన్యాయ మార్గాలలో చరించెదరని విశ్వసిస్తున్నాను.

### కెనడా పార్లమెంటులో ఉపన్యాసం.

చర్చిల్ ప్రధాని అమెరికానుండి కనడా వెళ్లి, బ్రిటిషు వలసరాజ్యమగు యీ దేశ శాసనసభలో డిశంబరు 30 వ తేదిన ఉపన్యసించినపుడు ఘనముగ స్వాగతమొసంగబడెను. మాతృదేశ రక్షణకు కనడా సేనను పంపినందుకు కృతజ్ఞత తెల్పుచు, శత్రువు ఇంగ్లండుపై దాడివచ్చినచో యిదివరకు ప్రపంచంలో కనివిని యెరుగనంత తీవ్రముగ పోరు జరిపి ఓడించుటకు కనడా సేన సిద్ధముగ నున్నదనిరి. హాంగుకాంగులో కూడ కెనడా సేనలు జపాను సేనల నెదిరించి కొన్ని రోజులు నిలుపరించుకోనియుండి, తమ దేశమునకు కీర్తి తెచ్చినవనిరి.

శత్రువులు దీనిని సర్వ ప్రపంచయుద్ధంగా మార్చదలచిరి. వారికి ఆశాభంగం కాలేదనిరి. ఫ్రెంచివారు ఇంగ్లాండును విడచి జర్మనీ కాళ్లక్రింద పడడం నిరసించిరి. కనడాలో చాల మంది ఫ్రెంచి భాష నేర్చినవారున్నందున చర్చిల్‌గారు కొంత సేపు ఫ్రెంచి భాషలో మాట్లాడిరి. ఫ్రాంసు పడిపోయినపుడు, ఇంగ్లాండుకూడ కొద్ది రోజులలో పడిపోతుందని, కోడిపిల్ల పీక నులిపినట్లు నులిపివేయబడునని ఫ్రెంచి ఉద్యోగి ఒకడనెను. కాని ఒక ఏడాది ఇంగ్లాండు ఒంటరిగానే యుద్ధం సాగించింది. అట్టేమి జరుగలేదు. హాలెండు ఫ్రాంసువలెగాక జర్మనీతో పోరు సాగించుచున్నది. ఇపుడు తూర్పు దీవులందు జపానుతో యుద్ధమునందు హాలెండునకు అమెరికా-ఇంగ్లాండులు సహాయం వెడలుచున్నవి. "జపానుతో యీ క్రొత్త యుద్ధమును మేము కలసి చేయుదుము. మేము కలసి బాధల ననుభవించితిమి. ఇపుడు కలిసి విజయం పొందెదము" అని చర్చిల్‌గారనిరి.

ఇపుడు జరగబోయే యుద్ధంలో మూడు దశలున్నవనియు, మొదటిది యావత్తు బలాన్ని సమీకరించుకొని, శత్రు దాడులను ప్రతిఘటిస్తూ, బలాన్ని అభివృద్ధి చేసుకుంటూ పోరాడడమనియు, ఈ కాలంలో నౌకా నిర్మాణం ఎక్కువగుననియు, రెండో దశ పోగొట్టుకొన్న రాజ్యభాగాలన్ని తిరిగి సంపాదించే కాలమనియు చెప్పిరి. ఈ యత్నములందు ఆక్రమిత దేశాలలో తిరుగుబాటులు తోడ్పడగలవు. మూడో దశ శత్రుదేశాలపై దండయాత్ర చేసి, నేరస్తులకు తగిన శిక్ష విధించుట. "మిత్రమండలితో చేరిన అన్ని దేశాలవారుకూడ నిశ్చల హృదయంతో విశ్వాసంతోను ఎన్నికష్టాలయినా భరిస్తూ, ఒకరినొకరు విడువకుండా, నిజమయిన సోదరులులాగ తుదివరకు తమ విధిని నిర్వహించాలి" అని చర్చిల్‌గారు హెచ్చరించిరి.

## 1941 వ సం॥లో భారతీయ సేనలు.

### ఆఫ్రికా, సిరియా, ఇరాకు, పెర్షియా, మలయా, హాంగుకాంగు యుద్ధరంగాలలో కీర్తి గడించిరి.

### సేనాధిపతి వావెలు ప్రశంస.

"1941 వ సం॥లో తమ సేనలు లిబియా, తూర్పు ఆఫ్రికా, సిరియా, ఇరాకు, పెర్షియా, మలయా, హాంగు కాంగులందు చేసిన ఘనకార్యములను స్మరించి ఇండియా గర్వింపవచ్చును. వారిదివరకు గడించిన కీర్తిని మించి గడించిరి. ఇదివరకుకన్న ఎక్కువ ప్రశంసింపబడిరి. ఇదివరకు కన్న చాల తక్కువ నష్టపోయిరి." అని భారతదేశ సర్వ సేనాని నూతనవత్సరాదిని రేడియో ఉపన్యాసంలో తెలిపెను.

1941 వ సం॥లో ఇండియాకు యుద్ధ ప్రమాదాలు చేరువయినవి, అందుచే బాధ్యతలుకూడ ఎక్కువైనవి. ఫ్రెంచి సైన్యం వెనుకకు మరలి పారిపోతున్నపుడు భారతీయ మ్యాలుకంపెనీ దళం, నిలచి పోరి చివరకు బలవంతాన విధి లేక లొంగిపోవలసివచ్చెను. వారి ధైర్యసాహసములు ఫ్రెంచివారి పొగడ్తలనేగాక శత్రువులగు జర్మనుల పొగడ్తలనుగూడ బడసెను. భారతీయ సేనలో చేరుటకు యింకను చాల మంది కుతూహలపడుచున్నారు. అట్టివారు యింకోచోట యెక్కువ ఉపయోగపడతారని నమ్మకంవుంటేనే తప్ప, లేకుంటే వారికి సైనికాధికారులు, సైన్యంలో ప్రవేశం నిరాకరింపరు.

"1941 వ సం॥లో ఏమి జరిగిందో చూడండి—పెద్ద తుపానువంటి గండం దాటితిమి. భౌతికంగాను నైతికంగాను యిదివరకుకన్న నయంగా నున్నాము. చివరవరకు ఒంటరిగానే శత్రువు నెదుర్కొన్నాము. ఇపుడు మిత్రులు చేరేరు. కావున 1942 వ సం॥లో యింకా ఎక్కువ ధైర్యంతోను విశ్వాసంతోను వుండవచ్చును. యింకా కష్టాలు రావచ్చును. అయితే, చిట్టచివరకు మన ధర్మకార్యమే విజయమవుతుందని విశ్వాసం కలిగియుండవచ్చును. 1942 వ సం॥లో అందరికీ అదృష్టం ఉండాలని, ఏమి వచ్చినా భరించేశక్తి యుండాలని, విజయం మనదే యను ఆత్మవిశ్వాసం ఉండాలని కోరుచున్నాను" అని జనరలు వావెలుగారు భారతీయుల నుద్దేశించి తెలిపిరి.

---

...చుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.
...గు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.